సీ. అభిసారికావృత్తి • నరిగి వచ్చెడువేల్పు, మించుఁబోఁడుల నడ్డ•గించి కదిసి
ప్రోషితాయాతది•వ్యులవిమానము లూరు, సేరకుండఁగ లాగి•చెఱలఁ ద్రోచి
యపుడె క్రొత్తగ మింటి•కై రేఁగుకర్త దేవతల బిట్టుగ వెట్టి•పనులఁజొనిపి
యింద్రుఁ జూడఁగవచ్చు•నితరలోకస్థుల, నట్టిట్టుఁ బోనీక•పట్టి నిలిపి

తే.గీ. యొరులు సారలేని గడితంపు• పరిఖ యగుచు
వెలయు మిన్నేటి నీరెల్ల•వెలితిఁ బొఱఁ
గూల మందందగనుమలు •గొట్టి కూల్చి
ముట్టడించిరి దితిజు ల•వ్పట్టనంబు. ౮౫.

ఉ. ఆపురిముట్టు గొంద అపు• డావల నీవలఁ ద్రోవఁ బోవగాఁ
గువ్వలు గూడి రక్కసులు • గొబ్బున నాత్తపటీకుటీతటిం
జొప్పడుచప్పరంబులఁ బ•శుప్రకరంబుల బోయ లోయునం
దవ్వక రాటకొక్కెనిగఁ• ద్రాటఁ బిగించిరి ఖేటకోటులన్. ౮౬.

మ. వరుసం దానవు లన్నిలింపవరు సం•బంధంబుచే సువ్వన
మ్మరుదారామకుజంబులం దమరుదా•మక్షౌమభూషానులే
పనసాదుల్మణిగోహయద్విపరసా•వాసాదులున్ వమ్ము చే
సిరి వీఁకన్ ఖలకోటి కన్యసిరి వీ•క్షింపంగఁ జూపోపునే. ౮౭.

సీ. మీఁదిమేడలపై ర•మించునిర్జరలోక, పల్లవుల్ పైనుండి•పైకిఁ బోవఁ
గ్రిందిమిద్దెలఁబాన్పు• లందున్న గణహతా,గతరాజు లాయుధ•ప్రతతి వెదుకఁ
బెరటిపంచలలో జ•పించుసోమాసులు. దిడ్డిగంతల త్రోవఁ• దెలిచి పోవ
లోనిసావళ్లఁ బొ•ర్లుచు నున్నయితరపు,ణ్యులమాఁక లిఱుకుసం•దులను దూఁరఁ

తే.గీ. గహకహార్భటిఁజెలరేఁగి•గములుగట్టి, తెగువ నింటింటికిఁక కొంద•ఱుగఁ గడంగి
రక్కసులకూటు వొక్కటం• నుక్కు మిగిలి,సురనగరివేశవాటంబు•సొచ్చినపుడు.

మ. ఇద మిష్టమ్మని యించు కేని మది నూ•హింపంగ రాకుండుటం
ద్రిదివౌకఃప్రకరంబు లేమి యెవరే• రీ యేల యీగోల యు
ల్లదె యచ్చో నిదె యిందెపో యనుచు యా•తాయాత వీతోత్తరీ
యదశం ద్రొట్టిలఁ దల్లడిల్లె నగరం• బాబాల గోపాలమున్. ౮౯.

శా. ఆకోలాహల మాలకించి దివిజాధ్యక్షుండు రక్షోగణో
ద్రేకం బౌనిది యంచు నెంచి యనలార్కిప్రక్ష్యాదిదిక్పాలకా
నీకంబుం బిలిపించి యిప్పుడె సమున్నిస్సాణ ఘోషార్భటి
న్నాకానీకిను లెల్లఁ గూడుకొను సన్నాహంబు సేయుండనన్. ౯౦

సీ. సోఁకినచో నెల్లసురసురఁ దెగ మాడ్చు, వహ్ని యుద్యత్ప్రతాపమున నెగడె
సకలజీవులకు నంతకవృత్తిభయదుఁడౌ, యముఁడు మృత్యుసమేతుఁడగుచు నడచెఁ
బచ్చిరక్తముఁ ద్రావు పలలాశనుండైన, నైఋతుం డతిభీషణతఁ గడంగెఁ
దనవారి బలిమిచేతనె గుభాలున ముంచు, పాశి వాహినుల వెంబడిగ నెదిరె
జగము దూలింపఁగల ప్రభంజనుఁడు రేఁగె, భూరిసారంబు దనరుకుబేరుఁ డేగెఁ
గంటమంటలఁ జిలుకు ముక్కంటి గదలె, వారి వెనుకొని గీర్వాణవర్యుఁ దరిగె.

కం. అయ్యభియోగము గని తొలి, దయ్యపుజోదులును బాహుదర్ప మెలర్పం
జయ్యనఁ బిలుతిబియుక గడి, కయ్యమునకుఁ గాలు ద్రవ్వి కవిసిరి కడిమిన్.

గీ. వ్యోమచరు లౌట దైవతయోధు లపుడు, చదలు ననె యుండి పోరికి సంభ్రమింపఁ
గామచరు లౌట రాక్షసగ్రామణులును, బలసి యుండిరి మింట నే ప్రతిఘటించి.

శా. నేమిస్వానవిహీనమై బలయుగీనిర్యద్రజశ్శూన్యమై
వ్యోమస్థప్రచరద్విమానరహితంబై నారదారబ్ధగా
నామోదభ్రమణాదివిభ్రమవిశేషాపేతమై వారిసం
గ్రామారంభము చూడఁ జొప్పడె నపూర్వప్రక్రియావక్రమై. ౯౪.

మ. సరిగా నయ్యిరువాఁగుజోదులు యుగాంతచ్ఛాయ డాసి వీఁకం బర
స్పరశస్త్రాస్త్రనిపాతనంబులను లేశంబైన లోగాసి చెం
దరు బింకంబులవాసి డిందరు ప్రశంసిష్ఠప్రోద్ధతిం జేసి ప్రం
దరు పొంకంబులఁ బాసి కుందరు రణోద్యత్సాహసోత్సాహులై. ౯౫.

ఉ. ఆసమరాంగణంబున జయాపజయంబులు రెంటిలోన దే
వాసురు లెట్టియెవ్వరికి నాను తెలుంగఁగరాక యుండ నా
సాసలఁ జేసి గెల్పునకునై తగఁ బోర నదృశ్యరూపుఁడై
వాసవుఁ డున్నతావునకు వచ్చి గురుండు వచించె నిమ్మెయిన్. ౯౬.

ఉ. ఓవిబుధాగ్రణీ! యెఱుఁగవో! మునిశాప మమోఘ మాటచే
భావిజయంబులో రిపులఁ బాలగు నీసిరి యంచు వేగమే
యావల శ్రీవధూవరుకటాక్షమున న్మనుఁ జేయనంచు నం
గాఘన సేన నిట్లువిరఁగా వెతగాఁతియుఁబెట్ట నేటికిన్. ౯౭.

శా. ఘోరం బోర సమర్త్యసేనలకు గెల్పుం జాఘనున్ లేమిచే
రారా పాక్షుటిమాత్ర దోఁచు నతిమాత్రక్రూరదుర్వాగదు
ప్రారంభు ల్దితిజు ల్దడంగియును వీరస్వర్గముం జెంది యా
త్మారాశత్వము వాయ నేమి ఫలమీ వ్యర్థప్రయాసంబునన్. ౯౮.

ఉ. కావున నిప్డు డెందమునఁ గన్వడసంపఁ దాఁగి యుండి నీ
వేవిధినైనఁ గాని విభుఁ నే భజియించుచు నుండు మాతఁడుం
దైవతకోటిపై నెనరు దప్పఁడు తప్పడు నంటఁ ద్రోచు దై
త్యావళి ద్రుంచఁ జేయు నని యుంచ నెఱింగినచందమే కదా. ౯౯.

కం. అని తనగురుఁ డుపదేశిం,చిన విని యనిమిషపరుండు శ్రీహరిఁ గొలువం
జని యెన్ మందరశిఖరికి, జనియించిన గృతి స్వపక్షసంఘముఁ డగుచున్. ౧౦౦.

శా. అంతన్ దానవసైన్యనాయకులు ప్రత్యర్థు ల్పలాయించినా
రంతర్ధానము నొంద నెం దరిగిరో యంచు న్నిగూహింపఁ జే
కెంతే మే లిదె చాలదే విముఖులై యింద్రాదికు ల్పొట నిం
శ్చింతం దత్పుర మాక్రమింపఁ గదిసెన్ శ్రీశంభుశుంభత్ప్రపన్. ౧౦౧.

చం. మన బలిరాజుకో ల్తల కమర్త్యులె నిల్వక పారె దన్నయా
మనుజు లనంగ నెంతపని మానుషభుక్తతి నాతఁడేలుఁ జే
ర్కొని గణుతింపనేటి కరుగు ల్పరుగు ల్గని వాని దృష్టికిం
బనివడి ముజ్జగంబు లిటుపై నతఁ డొక్కఁడె ప్రోచుఁ జక్కఁగన్. ౧౦౨.

కం. అని సంరంభవిజృంభణమున స్వర్గపురప్రవేశమునకు ముహూర్తం
బును శుక్రుం డిడి యెదుటం, గనుపట్టం బట్టనాట్టగతులై రసురుల్. ౧౦౩.

గీ. పుట్టినని గోలె నసురసమూహమునకు, నాత్మల సురాలయప్రవేశాభిలాష
కలదు గావున నట యబ్బెఁ గాని యప్పు, డాసవామోద మింతైన నబ్బదయ్యె.

గీ. వేశవాటమునందు • విడిసిపడి పూర్వదేవ, వీరభటులు చటులవృత్తితోఁ బ్ర
వేశ మొనరఁజేసి • వేల్పుసానులమదావ, లేపగరిమఁ బట్టి • వెదకు నపుడు. ౧౦౫.

సీ. ముద్దుగుమ్మలు మేళ • మునఁ గేగ నింటికావలి యుండు ముసలిపాపలును లేరు
గోవాఁడ్రతో సందు • గొందుల గుసగుసల్, సలిపెడి తాపికత్తెలును లేరు
కన్నుసన్నల వీథి • గడపల లేబోజుం, గులసాని గొల్లుక • త్తెలును లేరు
సపరింపఁదగు పను • ల్సమకూర్చు నూడిగంబులకుఁ జేరివచ్చిన • పడుచులు లేరు
సాను లెటుపోయిరో వాండ్రతో నెవ్వఁడ్రు, దరలిరనితోఁచఁ దలఁచిన • తలుపు లెల్లఁ
దలఁచినట్లనె యుండె నద్దిర యటంచు, మిగుల విసివిరి రక్కసి • మిండ లపుడు.

సీ. పిల్లి పొర్లింపఁ బ్రాఁతవినపాలకుండనా, నమృతకుండము శూన్య • మై తనర్చె
నూనె చట్టవునేల • నయినాఁగ సురగవి, పాడుఁగు పయోహీన • ముగను దోఁచెఁ
జెలఁగి గూండ్లిడిన ప్రమాఁ • కులువోలెఁ గల్పవృ, క్షములు నిష్ఫలము లై • కాన నయ్యెఁ
మంచువేసవినాఁటి • మడుఁగునా మిన్నేటి, యస లెండిబీఁట లై • యడుగుఁ జూపె
నమర నమరావతీపట్ట • నమును విడిచి, సకల విబుధవ్రజంబుతో • సత్పథమునఁ
బొదలునలరాజువలపల • పోవఁ దలఁచి, యసురవిసరంబు విడిసిపడి • యాక్రమింప.

సీ. నందనోద్యానంబు • నందనోకహసమూహం బవకేశిభా • వంబుఁ గనుట
మందురామందిర • మందు రాజిల్లు తేజులంతేని జవశూన్య • వృత్తిఁ గనుట
నాలానబద్ధమౌ • దాలానపద్యనం, ఘాత ముద్వాంతవై • ఖరిని గనుటఁ
గామయానతమించు • వ్యోమయానంబు లుడ్డీనసామర్థ్యక • హానిఁ గనుట
సరసి నిరసించుకొని రాత్మ • లందు వట్టి, గొడ్డు తాకట్టువిసుపఁ గై • కొనఁగ వేదు
గొంగిలింపంగఁబోయిన • మంగలంబు, దొరకెనను మాడ్కి నంచు దై • త్యులు విరక్తి.

చ. ఉతిసుతకోటి లిప్పగిది • దివ్యులపట్టవ మాక్రమించి య
ప్రతిహత రీతి ఖ్యాతిగల • రాజగృహంబున రాజు నాశ్రయ
ప్రుత మగుమంత్రిగేహముల • మంత్రులు జోదుల యిండ్ల జోదు లం
చితగతిఁ దత్తదర్హుల వసించిరి తత్తదగారసీమలన్. ౧౦౯.

ఘ. అసురస్తోమము సామదానరహితం • బై భేదదండద్వయం
బెసఁగన్ వేల్పులపట్ల దౌర్త్యమున నుజ్జృంభించి యభ్యంచితా

ప్తనమూహంబుగ నింద్రమందిరమునం దత్త్రత్పసిద్ధప్రదే
శనమాలోకనకౌతుకం బడర సంచారంబుఁ గావించుచున్. ౧౧౦.

సీ. కట్టించుకొనినాఁడు కద వైజయంతంబు, తన కేమొ యిది శాశ్వతం బటంచుఁ
గావించెఁ గద యోలగము సుధర్మాస్థాని, తన యధికారంబె తప్ప దనుచుఁ
బాలించెఁ గద స్వర్గపట్టనం బేపట్టు, నను దన కదియె కాణాచి యనుచుఁ
గొలిపించుకొనెఁ గదా పలపించి యప్సరస్సతులచేఁ దన కింపెసఁగ నటించు
నౌర యాయింద్రుఁ డిప్పు డెందఱిగెనొక్కొ, మునలఁదొలి వేల్పుల మాటమఱియు [సవతి
తల్లికొమరుల మాటఁదత్స్వర్గరాజ్య, మెల్లమనకనుభోజ్యమం చెలుఁగఁజొక్కొ.

గీ. అనుచు నమరేశ్వరసమృద్ధిహరణరూప, కాభిమతసిద్ధిజనితధన్యత్వబుద్ధి
శుద్ధమాత్సర్యగుణసమాబద్ధమగుచు, నుద్ధతత్త్వంబుఁ బ్రకటించుచుండు నంత.

సీ. మునుము న్నెలేపయ్యె నెనసి యుండిన హవి, ర్భాగముల్ సురలతోఁ బడయఁ దనకు
సమకూరలేదయ్యె నమృత మింద్రునితోనె, యంశ్వగ్గితం బౌట నపుడు భుక్తి
యందుంచి వేట కేని యురుగంగఁ బ్రతిబంధకం బయ్యె నాస్త్రీయుకర్మపాశ
మెల్లైన నచ్చోట నే యుండవలె నన్న, దుస్సహం బయ్యె దైత్యులకు బాధ
యయ్యయో యిట్టి నశగర్హనత్యయోగ్య, మైన యధికారమునఁ దప్పదయ్యె "స్వర్గ
మునఁ జబోయిన నెడియేకు" లనువితాన, ననుదువగఁ జెందెఁగర్గదే వాశియు [పుదు

ఉ. ఆమెయి నాకలోకవిధవాక్రమణం బొనరించి దానవ
గ్రామణి దానపత్పృథమగణ్యయశం బనిశంబునుం గ్రలో
కీమహనీయమై వెలయఁ గేవల ధీవిలసత్ప్రభావుఁడై
స్వామిహితైకలక్షులగు వారల మంత్రులు గాఁగఁ గైకొనెన్. ౧౧౩.

చ. స్వజనములోఁ బరస్పరము స్వప్నమునందున మత్సరత్వముం
బ్రజల కొకళ్లొకళ్లకును భావములం గలహప్రవృత్తియుం
బ్రజనితమైనచో విభుఁడె బన్నము నొందు కెఱుంగఁ గాన న
గ్గజిబిజి లేక యుండ నధికార మొనర్చె సమర్థకార్యుఁడై. ౧౧౪.

ఉ. ఎవ్వరి నెట్లు మన్నఁదగు నెవ్వరి కేక్రియ గారవింపనౌ
నెవ్వరి కేవితానఁ దనియింపఁగ వచ్చును వారి నెల్లఁ దా

నవ్విధి నాదరం బెనఁగ నాఁకసి ప్రోచిన సుస్థిరంబుగా
నివ్వటిలన్ విభుత్వమును నీతిఁ జరించు నతం డతంద్రుఁడై. ౧౧౬.

గీ. అతఁడు బలియను బుణ్యజనాగ్రగణ్యుఁ, డమితకర్బురసము పేతుఁడగుటఁ జేసి
యరసి యాత్మీయులకు నెల్ల నభిమతార్థసిద్ధి గావించుచును బ్రోది చేయుచుండె.

క. ఇట్లొప్పుట వియచ్చరపతి, లచ్చిమగని ప్రేమ గని తలంపునఁ గల యా
గ్రచ్చర లాదరించుకొనం, దచ్చరణశరణ్యవృత్తిఁ దగ వర్తిలుచున్. ౧౧౭.

సీ. ఉరుతరమణికిరీటోత్తమాంగము వాఁడు, ఘనసన్నిభోత్తమాంగముల వాఁడు
బాహాంతరాశ్రీసంభరితతల్పము వాఁడు, వటదళాహ్యాభ్యితల్పముల వాఁడు
కమనీయఘనకనత్కనకనేత్రము వాఁడు, ధవళాబ్జపత్రనేత్రముల వాఁడు
పరిపాలితానేకభక్తచక్రము వాఁడు, కరధృతశంఖచక్రముల వాఁడు
అంబుజప్రియకోటిధామంబు వాఁడు, మునిహృదయవికుంఠధామముల వాఁడు
విధికి నిగమంబు లొసఁగిన విభుఁడు నాఁడు, సిరుల నాకిడి యెపుడు రక్షించునొక్కొ.

ఉ. ఎవ్వఁడు విశ్వ మెల్ల సృజియించె విరించనరూపధారియై
యెవ్వఁడు ప్రోచు మంచుఁ గమలేక్షణుఁడై యుపసంహరించు వాఁ
డెవ్వఁడు రుద్రరూపమున నీభువనస్థితి నస్త్రదాదులం
దెవ్వఁడు నివ్వటించె నతఁ డెవ్వఁడు నన్ గృపఁ బ్రోచుఁ గావుతన్. ౧౨౦.

మ. తన కైశ్వర్యములం గొలంతయును స్వాతంత్ర్యంబు లే దీశ్వరుం
డును సర్వజ్ఞుఁడు సర్వసాక్షి భగవంతుం డైన యాశౌరి దే
యని యెవ్వండు ప్రపన్నుఁడౌ నతని స్వీయత్వాభిమానంబుచేఁ
గని రక్షించుచునుండుఁ జేల ననుఁ జాలం గాచు నివ్వట్టునన్. ౧౨౧.

కం. ఆపాపనిధియై సిరి యెవ్వని పాయని కరుణాదోడుపడ లోకములన్
గని కరముఁ బ్రోచు నాతని, కనికర మిఁక నెపుడు పడయఁగలుగునో నాకున్.

మ. అని యీరీతిని దైత్యనాథుఁడు ప్రపంచాతీతసామర్థ్యవ
ర్తనుఁడౌ శ్రీహరిదివ్యమంగళపవిత్రశ్రీచరిత్రంబు లె
ల్లను గీర్తించుచు నార్తి మీఱఁగఁ బునర్లక్ష్మీప్రసాదార్థియై
యనిశంబున్ మది నాదిదంపతుల నేప్రార్థించుచున్నంతలోన్ ౧౨౩.

క. అరిదరకరుఁ డగుహరి యిపు, డరిదరకరుఁ డగుచు నీకు◆ నభయం బిడునో
సురవరదానవరిపుభా, సురవర కారుణ్యగరిమ◆చొప్పెఱుఁగ నాకో. ౧౩౨.

గీ. అపుడు పరిసరవర్తులై◆నట్టిసురలు, దివిజవిభుఁ గాంచి యొజ్జలు◆ దెలిపి నటుల
భక్తవత్సలుఁ డగుపర◆వాసుదేవు, దర్శన మొనర్పఁ గెందేల◆తడవు సేయ. ౧౩౩.

చ. అనవుడు దేవభర్త చతు◆రాస్యుపకైన నలభ్యమైన యా
ఘనునిపదాంబుజంబులను◆ గన్గొను సంతతిభాగధేయమా
సనకసనందనాదు లగు◆సంయమివర్యులలో నొకండనో
యనవరతాత్మబోధభరి◆తాత్ముఁడనో యెటు నాకుఁ జొప్పడున్. ౧౩౪.

శా. ఆవైకుంఠపురాధిరాజ్యవిభవం◆బామూలచూడంబుగా
నే వేమాఱులు సన్మునీశ్వరులు వ◆ర్ణింపంగ భక్తిస్ఫుర
ద్ధీ వింటిం గనుఁగొంటి నెక్కటితఱి వా◆ర్ధవాదు లేగంగ నే
నీవాచస్పతి మున్నుగాఁ జని దిశా◆నీశానుషక్తుండనై. ౧౩౫.

క. అప్పటి నాచొప్పెప్పుడుఁ, జెప్పఁగ లేదయ్యెఁ గాని◆ చెప్పఁగ వలసెం
నిప్పటి యిప్పుడు మీతో, నప్పురి మాయూరుఁ జేరు◆నడిగెనె యొకఁడున్.

సీ. కడుపునఁ గన్నట్టి◆కొడుకైన బ్రహ్మకు, వెలుపలిపూఁదోట◆విడియఁ గలిగెఁ
బులహపులస్త్యాది◆మునిసంఘము వసించె, గరుడముఖ్యులగృహా◆గణములందుఁ
గ[illegible]గాలత్రే[illegible]◆[illegible] [illegible] వనయొజ్జ, లక్కడక్కడ నిత్య◆యాత్రజరిపె
నేను [illegible]◆నింటిపంచటరుంగు, [illegible] నిచ్చలిఁ బడి◆యాజ్ఞ వదని

తే.గీ. [illegible] ది[illegible]లను[illegible]◆ [illegible], విరజదరులందు నిరవొందు◆ తలల జాడ
నిలువ నీడయై నాకోక◆వ్యులసునట్టి, యమరులకు నంపనామరూ◆పములుఁ గలవె.

సీ. ఉపనిషద్వ్యాఖ్యార్థ◆ ముపదేశ మొనరించు, రాజకీరము గిశో◆రములఁ [illegible]
సామగానక్రియం◆సామర్థ్యమును దెల్పు, బంగారుకీలము [illegible]బ◆ములను జేర్చు
హరినామసంకీర్తనం ◆ బభ్యసింపఁగఁ జేయు, శారికదారికా◆నమితిఁ గనిని
ప్రణవనాదబ్రహ్మ◆[illegible]త్త్వ మెఱింగించుఁ, బుష్పంధయము డింభ◆ములను దాని

తే.గీ. యచట సుద్యానతరువుల◆ నధివసించు, సంతతానందితుండిల◆స్వాంతవృత్తి
నిర్విచారప్రచారంబు◆ నివ్వటిల్ల, శౌరి కరుణాకటాక్షప్ర◆సారమహిమ. ౧౩౮.

క. అరుదెంచి గుసుందపుడా, హరిహయుఁ డప్పగిది దీనుఁ • డైయుండినయా
యరుదెంచి భగవదిచ్ఛా, పరిణతిఁ దిరుగు లేమి • భావించి యనుక్. ౧౨౪

చ. పురుషుఁడు దాను కర్తనని • పొంగుట యెంతయు బుద్ధిలోప మీ
శ్వరుఁ డఖిలప్రపంచపరి • పాలకుఁడై నిఖిలాంతరంగముం
దిరుఁడయి కర్మవృత్తులు జ • నింపఁగఁ జేసి స్వతంత్రశక్తిచే
నరవిగఁ దత్ఫలంబుల నొ • సంగుచు నొక్కఁ డొసంగు లీల చేక్. ౧౨౫

ఉ. వచ్చును మేలొకప్పు డటు • వచ్చును గీడు నొకప్పు డంచు మే
లిచ్చుఁ దలంపకుండునరుఁ • డెవ్వఁడు గీడుఁ దలంచు వాఁడెపం
డెచ్చును దగ్గ లేక ఫలియించు శు • భాశుభకర్మసంచయం
బచ్చుపడంగఁ గర్తతి • యప్పరమేశ్వరులీలచే నగుక్. ౧౨౬

సీ. గ్రావసంఘంబులా • ఘవ మొందుఁ దూలము, గౌరవ మొందున • క్కజముగాఁగ
స్థలవిభాగములు క • చ్ఛములౌననూపముల్, మరుభూములగును వి • స్మయముగాఁగ
నాఢ్యుఁ డకించను • డగు నిర్ధనుఁడు మహా, భ్యత్వంబు నొందు న • బ్రంబుగాఁగ
స్థానీయతతి యర • ణ్యానీత్వము వహించు, విపినముల్ పురముగా • వింతగాఁగ

తే.గీ. జిత్రచిత్రప్రభావైక • పాత్రుఁడైన, యీశ్వరుని శక్తిచేత నీ • యింద్రజాల
మును గనుచునుండి పురుషుఁడు • తనకొకింత, శక్తిగలదని భ్రమయు నా • శ్చర్యము ను.

కం. పెట్టె మును పెట్టి యుపుదది, పుట్టుట తా రాక్కణాగా నఁ • బురుషుం డెదలోఁ
బెట్టక యుండిన యర్థము, పుట్టమికై వగల పొగులఁ • బొగులఁగ నేలా. ౧౨౭

చ. ఒకఁ డుపకారము జలిపె • నోరుపఁ జాలక తెక్కనంచు వే
ఱొకఁ డుపకారముం జలిపె • నొప్పగ ప్రేమ దల్పా నంచు నా
రక పరుబందుఁ బెట్టు నది • ప్రాజ్ఞతయే తనచేసికొన్న చేఁ
తను ఫల మప్పు డప్పు డగుఁ • దప్ప కటంచు నెఱుంగ కక్కటా. ౧౨౮

క, ఎపు డెపు డెద్ది యొనర్చిన, నపు డపుడు ఫలించు నదియొ • యని యెంచినచో
నుపశాంతి నొంది మానస, ముపరిమితానందమగ్న • మై తనివిఁ గనుక్. ౧౩౦

క. కావున నో శ్రీవల్లభ, కావు ననుం గృప నటంచుఁ • గని వేఁడినచో
నావంత మనములో నిఁక, నావంత మనము వహింప • మవ్విభు కరుణక్. ౧౩౧

క. అరిదరకరుఁ డగుహరి యిపు, డరిదరకరుఁ డగుచు నీకు నభయం బిడునో
సురవర దానవరిపుభా, సురవర కారుణ్యగరిమఁ జొప్పెఱుఁగఁ గాకో. ౧౩౨.

గీ. అపుడు పరిసరవర్తులై నట్టిసురలు, దివిజవిభుఁ గాంచి యొజ్జలు తెలిపి నటుల
భక్తవత్సలుఁ డగుపర వాసుదేవు, దర్శన మొనర్ప కిందేల తడవు సేయ. ౧౩౩.

చ. అనవుడు దేవభర్త చతురాస్యునకైన నలభ్యమైన యా
ఘనునిపదాంబుజంబులను గన్గొను సంతతిభాగధేయమా
సనకసనందనాదు లగు సంయమివర్యులలో నొకండనో
యనవరతాత్మబోధభరితాత్ముఁడనో యెటు నాకుఁ జొప్పడున్. ౧౩౪.

శా. ఆవైకుంఠ పురాధిరాజ్యవిభవం బామూలచూడంబుగా
నే వేమాఱులు సన్మునీశ్వరులు వర్ణింపంగ భక్తిస్ఫుర
ద్ధీ వింటిం గనుఁగొంటి నెక్కటితటి వాఙ్మార్గవాదు లేగంగ నే
నీవాచస్పతి మున్నుగాఁ జని దిశానీశానుషక్తుండనై. ౧౩౫.

క. అప్పటి నాచొప్పెప్పుడుఁ, జెప్పఁగ లేదయ్యెఁ గాని చెప్పఁగ వలసెం
దెప్పరి యిప్పుడు మీతో, నప్పరి మాయూరుఁ జేరు నడిగెనె యొకఁడున్.

సీ. కడుపునఁ గన్నట్టి కొడుకైన బ్రహ్మకు, వెలుపలిపూఁదోట విడిదియఁ గలిగెఁ
బులహపులస్త్యాది మునిసంఘము వసించె, గరుడముఖ్యులగృహాంగణములందుఁ
గాలఁగాలమ్మేసి కరుఁ దోట పనయొజ్జ, లక్కడక్కడ నిత్యయాత్రజరిపె
నేను విష్వక్సేను నింటిపంచటరుంగు, నంసె నిల్చితిఁ బదిమహాజ్ఞ పడసి

తే.గీ. విప్పి దివ్యాలయములచొప్పెఱుఁగ, జెప్పనేల, విరజదరులందునిరవొందు తజల జాడ
నిలువ నీడయ్యె వానికమ్యులగునట్టి, యమరులకునంపనామరూపముగలవె.

సీ. ఉపనిషద్విద్యార్థ ముపదేశ మొనరించు, రాజకీరము గిశోరములఁ జూచ్చె
సామగానక్రియాసాంప్రదాయమును దెల్పు, బంభ్యోకిలము బాలములను జేర్చి
హరినామసంకీర్తనం బభ్యసింపఁగఁ జేయు, శారికదారికానమితిఁ గనెసి
ప్రణవనాదబ్రహ్మ పారతత్త్వ మెఱిఁగించుఁ, బుష్పంధయయువ డింభములను దాని

తే.గీ. యచట సుద్యానతరువుల నధివసించి, సంతతానందతుందిలస్వాంతవృత్తి
నిర్విచారప్రచారంబు నివ్వటిల్ల, శౌరికరుణాకటాక్షప్రసారమహిమ. ౧౩౭.

చ. గరుడుఁడు శేషునిం దరియఁగాఁ దనకోఁటల దువ్వఁ జట్టుప
ల్గరుడనిలాంకురాన్నకబళంబులఁ దృప్తిగ వేయునోళ్ల వా
విరిఁ దగుపేర్మి డాసితినిపించు నతండును నిచ్చలుం బర
స్పరకలహంబు కల్మిగలఁ బట్టునఁ బుట్టెనె యెట్టివేళలన్. ౧౩౯.

మ. ఘననీలాభఘనంబులున్ భుజచతుష్కంబుల్ పయోజాతలో
చనముల్ గౌస్తుభభూషణంబులును భాస్వచ్ఛంఖచక్రంబులున్
వనమాలల్ గనకాంబరంబులును శ్రీవత్సంబులుం గల్గి వా
రును వీరంచును వేరులేదు హరిసారూప్యంబు లందందఱున్. ౧౪౦.

కం. కలశీహృతవిరజామల, జలశీకరసేకరచితసంస్థులతాంచ
ద్దళశీతలతులసీవన, తలసీమ మెలంగు ముక్తతతులం దవుడున్. ౧౪౧.

సీ. కోమలతులసీసరామోదనశ్రీమ, హిమవిచారణవృత్తి నెసఁగువారు
ధవళమృదూర్ధ్వపుండ్రవిశేషకవిశేష, ధారణగోష్ఠిచేఁ దనరువారు
గల్యాణగుణగణాఖండతరానుసంధానచింతనచేఁ దనర్చువారు
నిత్యసూరిసమాజనిర్ణీతహరితత్త్వ, సిద్ధాంతఫణితిఁ జర్చించువారు

తే.గీ. నగుచు నందందుఁ బరికింపనందు నందు, నెగడు నిత్యవిభూతిఁ జెందిన యనేక
దాససంఘ సుస్వరమపదంబునందు, సందడిగఁ గ్రందుకొని మహానందపరిషు.

గీ. అందు గోవిందదివ్యపాదారవింద, యుగళసందర్శనస్పృహానిగళబద్ధ
దశపసెంచితి మమితవత్సరము లేము, లేము లేమున్న పపసెడలెనుసటు చు.

గీ. అది యఖండతరప్రకాశాభిరామ, మగుట నిది పవలిది రేయటంచుఁ జెప
రాని నచ్చోటఁ గాలనిర్ణయము సేయఁ, దరము గాదయ్యె మనబుధగురునకైన.

కం. అటులుండఁగ నాపనమున, ఘటియిల్లె నెంతొ విసువు కటకట యిట్టి
చ్చటఁ నిల్చు టెన్నినాళ్లో, యటమటగా నున్న దనుచు నవివేకమునన్. ౧౪౫.

కం. పుర్ఁబౌరసమాజంబుల, దరిఁ గాలక్షేపముసకుఁ బరియం జన నె
వ్వరునైన నించుకైనను, బరికింప రటన్నఁ బలుకఁ బావింతు రెటుల్. ౧౪౬.

గీ ఒక్కతటి నొక్కరుండఁ బుణ్యోపశల్య, వనులవసహాలురైన నావంకఁ జావి
పలుకరించిన సుబుసుపోవచ్చుననుచు, సంచరించుచు నిటు మదినెంచుకొంటి.

సీ. నిత్యకృత్యంబుగా • భృత్యభృత్యులనైన, కార్యకారులటంచుఁ • గాంచుకష్ట
మేపూఁట కాపూఁట • కెక్కుడుగుమ్మంబు, దిగడుగుమ్మంబుగాఁ • దిరుగుశ్రమము
నెవరైన స్వామికి • నెఱిఁగింపరోకోయంచుఁ, బ్రతిహారుల భజింపఁ • బడుప్రయాస
మేధావివాహ్యాళి • కేతెంచు భగవంతుఁ, డని యిటునటుఁ బ్రోవ • లరయుకష్టి

తే.గీ. కటకటా యిట్టిదనుచుఁ దె • బ్బుటకుఁ దరమె, విసువుపుట్టించునాశ్రయ • వృత్తియెట్టి
వారికైనను బ్రాపింప • వలదు కార్య, పరుల కెచ్చోట నిట్టివే • బాము లనుచు.

సీ. ఎవరైన వడివడి • నెదురుగా నేతేర, ననుఁ బిల్చుటకె వత్తు • రని తలంతు
సఫలప్రయత్నులై • చనువారివార్తలు, విని నాకు నిటు లెప్పు • డని తలంతు
నగరిమోసలకేవి • నడయాడువారినెల్లను స్వామివల్లభు • లని తలంతు
దేవేరిబోనగ • త్తెలచేత నైన నా, మనవిఁ దెల్పింతునా • యని తలంతు

తే.గీ. నాకలోకంబునుండి నా • రాకఁ జెవుల, సోఁక నెఱిఁగించు వారలు • లేకయుంటల
శ్రీకళత్రుఁ డుపేక్షించెఁ • గాక యున్న, నీకరణి నుందునే యంద • నేకతమున.

శా. ముల్లోకంబుల నేలుచుందు సవనం • బుల్నూఱు గావించితిన్
దల్లంబై తగుసౌమనస్యమున వ • ర్తింతున్ బుధశ్రేణియం
దెల్ల న్మఖ్యుఁడనై మెలంగుదను నం • న్నే యిట్లుపేక్షించినాఁ
డుల్లంబందు నెఱుంగఁడో హరి యటం • చూహించుచున్నంతలోన్ ౧౫౦.

మ. ఒక మందారమహీజకోటరకులా • యోపాంతమందున్న శా
రిక వేరొక్క నికుంజనీడగతకీ • రిం జూచి వీఁ డెవ్వఁడో
వికలస్వాంతుఁడొ దుర్వినీతుఁడొ గ్రహా • విష్టుండొ నా మూఱు చే
రక వర్తించుచు నుండెడిన్ హరిసప • ర్యాగంధహీనుండనన్. ౧౫౧.

ఉ. నావిని వీఁడు మూఁడుభువ • నంబులనేలెడు వాఁడ నంచునుం
దా విధి మీఱి నూఱుసవ • నంబు లొనర్చినవాఁడ నంచునుం
గేవలసౌమనస్యమునఁ • గీర్తిఁ బ్రవర్తిలుచుందు నంచు నా
నావిబుధప్రధానతఁ ద • నర్చెద నంచు మెలంగు గర్వియై. ౧౫౨.

సీ. ఒకటి రెండు జగంబు • లొక్కఁడె వీఁడేలు, వాఁడ నంచును గర్వ • పడుచునుండు
నిట్టివి పదునాల్గు • సృజియించినవిరించి, యేమూల నుండెనో • యెఱుఁగ మెవర
మట్టిబ్రహ్మాండంబు • లమితసంఖ్యలు సృజింప, గను దెంప నణఁగింపఁ • గనుసమర్థుఁ
డైనశ్రీరమణుపా • దాబ్జముల్ దిలకించు, సద్భక్తిహాయను నిగళంబు • చేతఁ గట్టు

తే.గీ. పదిమొనఁబడదానుముక్తులే • పడయఁదగిన, ఫలము బద్ధునకేరీతిఁ • గలుగునొక్కొ
యని తలంపక తన కబ్బు • నని తలంచు, నెంత మూర్ఖుండొ వీఁడంచు • నేవగించి.

కం. హరిపదసందర్శన మఁట, దురహంకారాతిరేక • దుర్లలితహృదం
తరుఁడగు దనకఁట వెసనది, దొరకమి కొక్కింతవినుగు • దోఁచెనఁటకటా. ౧౫౪.

సీ. బహుజన్మవాసనా • పరిపాకసంలబ్ధ, నిశ్చలాత్మజ్ఞాన • నియతిఁ జెంది
భగవదర్పణముగా • భావించి సత్కర్మ, ముల నొనర్చుచు విని • ర్మలమనీష
సకలభూతములందు • సమత వర్తించుచు, శాంతుఁడై దాంతుఁడై • సంతసమున
సర్వజ్ఞభావంబు • సార్వత్రికత్వంబు, సర్వేశ్వరత్వ మీ • శ్వరుని దనుచుఁ

తే.గీ. దలిసి సంతతసత్సంగ • విలసనమున, సారిది నిస్సంగుఁడై ద్వంద • శూన్యవృత్తిఁ
బరమభాగవతుం డైన • వాఁడు కాని, శ్రీహరిపదంబు నందఁబోఁ • జెందఁగలఁడె. ౧౫౫.

శా. తా సేవ్యుం డఁట సేవకత్వమున ని • త్యంబు న్నిజస్తోత్రవి
న్యాసం బొప్ప బుధవ్రజంబు దన గే • హద్వారపార్శ్వంబునం
దీసంక్రందను దర్శనం బెపుడు చే • యించుం బ్రతీహారియం
చాసం జేసి వసింపఁ గోరు నఁట వీఁ • డత్యంతగర్వాంధుఁడై. ౧౫౬.

కం. అని యాడుకొనెడుమాటలు, విను నప్పుడు నేను మిగుల • విస్మయలజ్జా
వనతాస్యుఁడనై వానికి, వినతాంగుఁడ నగుచు విన్న • వించితి నిట్టుల్. ౧౫౭.

ఉ. శారికలార! శౌరికథ • సారెకుఁ జారుకథార్థముల్ మనో
హారికలారవస్ఫురణ • నద్భుతభంగి నెసంగు నట్లు గాఁ
గోరికలారఁ దెల్పుచును • గూరిమి గాంచెదు మీర లీజగ
ద్భూరికలారహస్యముల • పోఁడిమి బుద్ధి నెఱుంగు టబ్రమే. ౧౫౮.

కం. ఏ నెప్పుడు హరిపదని, ధ్యానము గావింతు నొక్కొ • యని మదిలో నెం
దే నెప్పుడును దదేక, ధ్యానమున నె యుంట మీహృ • దయ మెఱుఁగ దొకో.

గీ. శౌరిపదదర్శనవ్యాప్తిఁ • గోరి వచ్చి, యింతకాలంబు నిందుంటి • మిందఱమును
మాయుపంతంబు నొక్కింత • మాత్రమైన, స్వామి కెఱిఁగించువారలె • వ్వారు లేరు.

గీ. మాకు నర్హ్యపదముల కె • మ్మార్గముండె, ప్రోవుఁ డనుచు నధికార • ముల నొసంగె
భక్తి నే మమ్మహాత్ముని • యుక్తిఁ జేసి, పాదుకొని యుంటి మయ్యయి • పదములందు.

క. ఈవడువున నే మెల్లను, శ్రీవల్లభుదివ్యపదముసేవింప మదిన్
భావించి వచ్చి యిచ్చట, నేవిడియుట నచటి చందమే మయ్యె నొకో. ౧౬౨.

చ. అన విని వానిలో నొక విహంగము నన్గని యెంతమాట నీ
మనమునయందు నెవ్వఁడు రమారమణాంఘ్రిసరోజయుగ్మద
ర్శనకుతుకంబె కాని యితరస్పృహలేమియు లేమికి న్నిద
ర్శన మిది చాలు నింటికడ చందము లందలి చింత యొప్పదే. ౧౬౩.

చ. పదపద నీకుఁ జూడ భగవత్పదదర్శన మేడ బ్రహ్మ ల
ర్బుదములు పంచలం దిరిగి పోవుదు "రేనుఁగు లేటఁ గుంకుచో
వదలక పాటిరే వడుగ వచ్చెను నక్క" యటన్న భంగి ను
న్నది కద నీదు చందము వినందగ వింకిట మాకు నీనుడుల్. ౧౬౪.

చ. అనుచుఁ దృణీకరించి తెగనాడిన రెండవ యండజంబు న
న్గని వచియించె నీకిపుడు గల్గదు నీయభిలాషసిద్ధి యె
వ్వనికి లభించె మున్ను భగవత్పదదర్శన భాగ్య మెంతయున్
ఘన మగు ప్రాజ్యరాజ్యమదగర్వము సర్వము వీడు నంతకున్. ౧౬౫.

గీ. స్వామి సన్నిధిఁ దెలుప నెవ్వారు లేర. టంచుఁ బల్కితి వింతయానార శౌరి
యనఁగ సర్వజ్ఞుఁ డతఁ డెఱుంగ నివి కలవె, యింత యజ్ఞాని వేమిర యింద్ర నీవు.

గీ. అతఁడు ప్రాకృతనేతలగతిని మనవి, దెలుపఁ దగువాఁడె భక్తులు దలఁపఁ దోఁచు
నప్పు డిప్పుడు నందిందు నతనికితని, కనక యెవ్వఁడు నందందనందతికిని. ౧౬౭.

ఉ. మంతనమంచుఁ గొన్ని మటుమాయలమాటలఁ జెప్పి పుచ్చు ట
య్యంతిపురంపుటూడిగపుటన్నులమిన్నల నాశ్రయించు ట
త్యంతముఁ గార్యసాధనములోఁ గలికాలపుఁ బ్రాకృతావనీ
కాంతులపట్ల నట్లనె జగత్పతియా హరిపట్ల నెంచితో. ౧౬౮.

చం. ఉపచితిపాత్రుఁ డార్యుఁడు సమున్నతకీర్తి యుదాత్తమూర్తి వా
ఙ్నిపుణుఁడు ప్రత్యయాస్పదుఁడు నిర్మలచర్యుఁడు ధైర్యధుర్యుఁ డా
త్మపరబలాబలజ్ఞుఁ డసమప్రతిభాంకుఁడు నైన నీగురుం
డిపుడు ద్వితీయకార్యఘటనైకరతిం దగు నీతిచాతురిన్. ౧౬౯.

కం. నిరతంబుఁ దదనుమతికృతి, నిరతం బగుచిత్తవృత్తి♦ నిరహంకృతివై
కరణీయంబుల భృత్యుని, కరణిం గావింతు వేని♦ కరుణించు నినున్. ౧౭౦.

కం. అని బుద్ధిఁ గఱపి పొమ్మన, మనపురికిం గురుదిగీశ♦మండలితోడం
జనుదెంచి యచటి వార్తలు, వినవిన స్మయ ముడిగె మదిని♦ విస్మయ మొదవెన్.

ఉ. పౌరుల నెల్లరాఁ బిలిచి ♦ వచ్చితి మిచ్చటి కిన్నినాళ్లకే
మీరలు నందఱున్ సుఖులె ♦ యెవ్వఁడు నెవ్వఁగ మానియోగముల్
సారెకు నప్రమాదగతి ♦ నల్పుచు నుందురె క్రూరదైత్యు లె
వ్వారును దాడి రారు గద♦ వచ్చిన వారల నోర్తురే కదా! ౧౭౨.

సీ. వైజయంతము పొంత ♦ వర్తింతు రెవ్వార, లెవరు సుధర్మ చెంత♦ వసియింతు
రమృత కుండోపాంత♦మం దుందు రెవ్వరు, కామధేనువుదొడ్డిఁ♦ గాతు రెవరు
గురుమందిరమున నెవ్వరు కావలిగ నుండ్రు, చింతామణిని బరీక్షింతు రెవ్వ
రైరావతముఁ బ్రోది♦ నరయు వారెవ్వార, లుచ్చైశ్రవముఁ ద్రిప్పు♦చుందు రెవరు

తే.గీ. నందనవనమ్ముఁ బరికించు♦చుందు రెవ్వ, రెవరు మందాకినీతీర♦సవిధవివిధ
మణిఖచిత వేది సోపాన♦మండపములు, శిథిలములు గాక యుండఁ బ్రే♦క్షింతు రెపుడు.

సీ. ఇచ్చోటి కెపుడైన♦ విచ్చేయుచుందురే ♦ స్వైరసంచారుఁ డౌ♦నారదుండు
మునితపోవిఘ్నార్థ♦ముగ నిల్పఁబడిన యచ్చరలు వర్తింతురే ♦ సఫలగతులఁ
బుణ్యకర్మఫలాను♦భూతి కై రావ్యోమ, యానముల్ సుకృతుల ♦ కనుపఁబడునె
దైత్యనాథులరాజ♦ధానులఁ ద్రిమ్మరు, ప్రణిధులు వత్తురే ♦ వార్త లరసి

తే.గీ. యాశ్వినేయుల భైషజ్య ♦ మమరుచున్నె, పుష్కలావర్తకకులాభ్ర♦ములు ధరిత్రి
సమయసముచిత భంగివ♦ర్షములు గురియు, చున్న వియొజన్నములఁ బిల్వ♦లాదవుచున్నె

మ. అను నాపల్కుల నాలకించునవు డ♦న్యోన్యంబు వక్త్రంబులం
గనుఁగొంచున్ భయవిస్మయంబులు పెనం♦గ న్వారు నేరొక్కచో
ప్పునఁ జూపట్టఁగఁ జెప్ప నేమిటికి మిం♦మ్ముం జూడ నాడెందమం
దున నొంజొక్కవితానఁ దోఁచు నన నం♦న్నుం జూచి వారందఱున్. ౧౭౫.

క. దేవా దేవరహృదయం, బీవిఁకనుభ్రాంతిఁ జెందఁ ♦ నీరలు మాతో
నావైకుంఠమునకుఁ జనఁ, గావలె నని పలికి చాల♦ కాలముఁ బయ్యెన్. ౧౭౬.

క. వేవేలయేండ్లక్రిందట, నీవడువున ననుట మాత్రమే గాని యదే
మో వైకుంఠపురంబున, కై విచ్చేయుటయు లేదుకద యిప్పటికిన్. ౧౭౭.

సీ. మొన్న గదా మీరు • పూజించి ముచ్చటించితిరి నారదముని • శ్రేష్ఠు తోడ
నిన్న గదా మీకు • విన్నవించిరి దైత్య, పురుషులవార్తలు గూఢ • చరులు వచ్చి
నేఁడే గదా మిమ్ముఁ • జూడఁగా వచ్చి ర, చ్చర లూర్ధ్వ మునులని • ష్ఠలను మాని
యిప్పుడే గద మీర • లేతెంచు పుణ్యులఁ, గంపించితిరి వ్యోమ • యానములను

తే గీ. మఱియు నెల్లిగదయ్య యే • మఱక మేము, మీరు గావింపుఁడని నియ • మించినట్టి
కర్జములనెల్ల జాగరూ • కతఁ గడంగి, కొలువువేళకు సవరించు • కొనఁగ వలయు.

కం. ఈలోకమహి కెన్నిపరుల్, హేళి న్నగ్రపకన్యకాస్వ • యంవరకల్యా
ణాలోకనార్థ మీశం, లేలిశచి వెంట నరిగి • తిరి సురయుతులై. ౧౭౯.

మ. అనుచుండం బయినుండి తోఁచు నొకఘం • టారావమాలించి వా
రును నేనుం దలలెత్తి మీఁదుఁ గనుచోఁ • గ్రొమ్మించులన్మించుచున్
స్తనితోదంచిత మైనమేఘు మనఁగా • సైరిణంబుచే రాణ గాం
చిన చొక్కంబగు వ్యోమయాన మరుదెం • చెన్ శంఖచక్రాంకమై. ౧౮౦.

కం. క్రమశమితవేగమై యా, ప్రమానమసమానమైన • విభవస్ఫురణం
బమరంగ నల్లనల్లన, మము డగ్గఱి నిలిచెఁ జూచు • మాత్రములోనన్. ౧౮౧.

కం. అందుండి యిందిరాకృత్యులం దగుగొందఱు వెలందు • లం గూడి శచీ
సుందరి వెలువడిరా మా, యందఱి డెందముల యందు • నబ్బుర మొదవన్.

ఉ. ఎక్కడి కెవ్వ డేగితి విం • దేటి విచిత్రము ప్రాణనాయికా
యిక్కడ నిన్ను నిప్పుడు గ • దే కనుఁగొంటి నటంచుఁ బల్కఁగా
నక్కజ మంది యేమి యిటు • లానతి యిచ్చెద రిప్పుడే కదా
యిక్కమలావధూసఖులు • నేనును డిగ్గితి మీవిమానమున్. ౧౮౩.

సీ. నాఁడు వైకుంఠంబు • నకు మీర లటు లేగు, నపుడె తోడ నెవత్తు • ననఁగ నుడుగు
మని యింట నను నిల్పి • యరిగిన మఱునాఁడె, శ్రీ వేలియుంగర మాన • వా లొసంగి
శ్రీదేవి నినుఁ జూడఁ • గాఁ దోడి తెమ్మన్న, నని యీవిమానంబు • ననుపరేచె
పనిచిన నన్నందు • వసియింపఁ జేసి యీ, ప్రావధూసఖుల్ • పరమపదము

తే. గీ. నందు నామె వసించుశు•ద్ధాంతమందు, డింప నామెయుఁ బ్రేమ వా•టిల్లఁబిలిచి
యుండు మిచ్చోట నీభర్త•యుండునంత, కాల మని యానతిచ్చిన•న్గారవించె.

గీ. ఎన్నినాళ్లందు జరిగెనో•యెఱుఁగఁగాని, నాఁటిబోటుల నల విమా•నమునుగూర్చి
యిపుడిపుడె యాయితంబుసే•యించిపలికె,నన్ను సానుగ్రహాలోక•నములఁజూచి.

కం. అమ్మా నీపతి నిజనగ,రమ్మునకుం జనియె నిపుడు • గ్రక్కున నీవుం
బొమ్మా మేలగుఁ జక్కఁగ,బొమ్మా యని భద్రవస్తు•వుల నిడి పనుపన్. ౧౮౬.

కం. వచ్చితిమి యనుపదమున, నిచ్చటికై యిప్పు డిపుడె• యింతకు మునుమీ
రిచ్చటఁ గాంచితి మనుమీ, ముచ్చట కెంతయును స్వాంత•మున వింతయగున్.

గీ. అనుచుఁ దన వ్రేలి నుండి ము•న్నాను వాలు,పనిచి నట్టిది యిదియె గై•కొనుఁడటంచు
నుంగర మొడల్చినాచేతి•కొసఁగు నపుడు,నాకరాంగుళిఁజూడశూ•న్యముగఁదోఁచె.

కం. దొంతరవింతలచే నిటు, దంతుర మగుభ్రాంతి దోఁగి • తల్లడపడునా
స్వాంతంబు చెదర నచ్చటి,కంతట నారదమునీంద్రుఁ•డరుదెంచె వడిన్. ౧౮౭.

ఉ. వచ్చిన వానిఁగాంచి తగు•వైఖరి మన్నన చేసి యేమి రా
యిచ్చటి కిప్పు డీయతివి•శృంఖలుఁ డైనమహానుభావునిం
దెచ్చితి వీశ్వరా యని మ•దిం దిగులొందుచునున్న నాతలం
పిచ్చనెఱింగి యాతపసి•యిట్లనె నల్లన సస్మితాస్యుఁడై. ౧౯౦.

శా. ఓహో యేమిది విన్నఁబో టొదవ నే•దో వింతయో చింతయో
మోహంబో మదిఁ దోఁగినట్టు ల యథా•పూర్వాననశ్రీసము
త్సాహాకారవిచేష్టితస్థితులచే • స్పష్టంబుగా నాత్మలం
దూహింపం దగి యుండె దీసురశచీ•యుక్తుండవై వాసవా. ౧౯౧.

గీ. అనిన నప్పటివాస్థితి•యంతవట్టుఁ, దెలుప నాలించి పలికె న•ద్దివ్యబోధ
మహితుఁ డిదియెల్ల నల్పసా•మ్రాజ్యమత్త,మతి వయిన నీదుదుర్మోహ•గతియె కల్గె.

గీ. ఇంత దుర్మోహమతివిగా•వేని నన్ను, నతివిశృంఖలుఁడైనమ•హానుభావుఁ
దని తలంతువె దేవర్షి•నగుట నాకుఁ,దద్విచారంబు నడుప రా•వలసె నిపుడు.

మ. నిగమాంతంబులు నిట్టివాఁడనుచు వ•ర్ణింపంగ లేవన్నచో
జగదీశుం గనుఁగోఁ దరంబగునె దు•స్సంసారమోహాంధులై

తగువిభ్రాంతహృదంతరంగులకు యత్నం బెంతే గావించినన్
భగవద్భక్తుల కట్లుగా కతఁడు చూపట్టుం గదా యంతటన్. ౧౯౪.

మ. తనభక్తుండను నేను గానొ నను వాత్సల్యాతిరేకంబునం
గని స్వీయంబగుదివ్యవిగ్రహముసాక్షాత్కారముంజేసి ధ
న్యునిఁ గావింపఁగ రాదొ యంచనెదవే మో నీవు భక్తుండవై
న నతం డిట్టు లుపేక్ష సేయునె సురేంద్రా యేల యీదుర్భ్రమల్. ౧౯౫.

కం. విను భక్తుల తెఱఁ గెఱిఁగిం,తును గోప్యము దృశ్య మగుచుఁ దోఁచిన యది యె
ల్లను వారలు శ్రీహరి భా,వనఁజూతు రతఁడు జగన్నివాసుం డగుటన్. ౧౯౬.

కం. హరి సర్వత్ర కలం డను,బరమార్థము నెవ్వఁ డెఱుఁగు భక్తుఁడు వాఁడే
హరియు న్వానికి యెల్లెడఁ, గరుణించుం దనదుమూర్తిఁ గనుభాగ్యంబున్.

గీ. తరలి వైకుంఠ పురికి నీవరిగి యందు, నెందు గోవిందుఁ డుండునో యెపుడునన్నుఁ
బిలువ నంపించునో యంచుఁ దలఁచు చుంటి,గాని దృఢభక్తిధ్యానింపఁ గడఁగ వైతి

మ. గురుభక్తిన్ గుఱినిల్ప నేర కలవైకుంఠంబుఁ బ్రోలంచు న
వ్విరజన్వాహినియంచు నత్తులసి సుర్వీజాతమంచున్ ఖగే
శ్వరశేషాదుల నిత్యసూరులనుచున్ భావించితే కాని య
ప్పరమేశప్రతిబింబబుద్ధి మదిసంభావింపవై తక్కటా. ౧౯౯.

కం. ఎక్కడి శౌరీ జన్మం, బెక్కడి యితరాంతరంగవృత్తిజ్ఞత్వం
బక్కడిదిది యెఱుఁక దొరకొను, టక్కడ హరియే చరాచరాకృతినుంటన్. ౨౦౦.

కం. హరిమాయ నెఱుఁగ నెవ్వరి, తరమా పరమాత్ముఁ డెటుల తలఁచిన నటులౌఁ
బెరమాటలేల భ్రమయుట, సురమాన్యరమాధ్యమహిమ చొప్పున నె సుమీ.

కం. నీ వెపుడు సపరివారుఁడవై వైకుంఠమున కతిఁగి తవ్వాడె యిచటన్
నీవిధమున నొకమాయా,దేవేంద్రుని సపరివారు దివిరి సృజించెన్. ౨౦౨.

ఉ. అంతట నారకుండక త్వదంగన యైనశచీవధూమణిన్
స్వాంతమునందు భ్రాంతి దొలఁగాదక యుండఁగ శీలరక్షణం
బెంతయుఁ జేమఁ జేయ మదినెంచి రమాసతిచేత నామె ను
ద్ధాంతమునందునుంచుటకునై పిలిపింపఁగఁ జేసె వేల్పిడిన్. ౨౦౩.

గీ. అపుడు శచి కానవాలు నీఁనంపి తనివ్రయుంగరము శౌరిమాయా సఁముద్భవంబె
యిపుడు నీచేత నదితిరోఁహితవిధంబు, గనుటయును శౌరిమాయాప్రఁకల్పితంబె.

గీ. నీవు స్వర్గంబునందు లేఁనితఱి నచట, నెగడుకర్జంబు లేరీతిఁ నగునొ యంచు
నీతలను భార మెల్లనుండెనను బుద్ధి, పుట్ట హరి నిన్ను పిలుఁగులఁ బెట్టఁ దలఁచి.

గీ. కారికాదంభమున నిన్నుఁ శౌరికాని, మాటల నహంక్రియాగర్వఁ మదము లణఁచి
కాదు కాలాంతరంబునఁగాని నేఁడు, హరిపదాలోకనంబు పొఁమ్మనుచుఁ బంచె.

కం. గెంటనికృప నంటినమతి, వెంటనె శచినింటి కనుపఁవే యని సిరి వా
ల్గంటి కెఱఁగించి హరి తెఱఁగంటిదొరా పనిచె నామెఁ గన్యాన నిటకున్.

గీ. ఈశచీప్రభూటిఁ యిపుడు చూపినయట్టి, మాయయుంగరంబుఁ పోయె నపుడె
నీదు వ్రేలిదైనఁ నిజమైనయుంగరం, బిప్పు డుండుఁ జూడుఁ మీ సురేంద్ర ౨౦౭.

కం. అనువపుడు నాకరాంగుళిఁ, గనుఁగొనుచో నంగులీయఁకసమేతంబై
కనుపట్ట నచటి వారల, మనంబు లద్భుతరసైకఁమగ్నములయ్యెన్. ౨౦౮.

గీ. మఱియు నమ్మాని యిట్లనెఁ మఘవ నీకు, గురుగురూపాయచాతురీఁ గురుతవలనఁ
గలుగు కాలాంతరంబునఁ గమలనాభుదర్శనము క్షీరవారాశిఁ దప్పకనుచు.

గీ. ఇదియనఁగ నెంతవింతనీఁమది కొకింత, భ్రాంతిమాత్రంబె కలిగె నిఁప్పటికిముందు
నాటు నస్వప్నతార్తి యంఁతటలభించు, నిష్టసంసిద్ధి యనితెల్పిఁ స్వేచ్ఛ నరిగె.

గీ. ఇన్నివిధముల హరిశక్తిఁ యిట్టి దనుచు, నెఱిఁగి యెఱిఁగియు నల్పసంమృద్ధిగర్వ
పరవశుఁడనై చెబడ రానిఁ పాట్లఁబడితిఁ, గాని యిడుమల విడనాడఁ గలిగె నిపుడు.

కం. ఆ సంయమి పలుకగువను, నానన్నా సంశయంబుఁ లడఁగె న్నుడు లే
లా నన్నము లయ్యెఁ శ్రమము, లాసన్నము లయ్యెఁ రమలుఁ హరికృప నింకన్.

చ. సురవరులార సూరిపరిఁశుద్ధుఁ డుదారుఁడు దత్తుఁ డైనయా
గురుఁడు గురుంద్రు మంత్రియు సుఁఖుంపు నియంతయునై స్వనీతిచా
తురి నను నెల్ల కర్జములఁ దోడ్పడి కావఁగ నావగ ల్నిరం
తరముగనుండునే మది ముఁదంబు పదంపడి కూడకుండునే. ౨౧౩.

ఉ. ఈ మహనీయబుద్ధి బలశాలి కద నా కదనైనచో రిపు
స్తోమములన్ జయించు నెటు చూపును ఓపును మాపు నోపి స
ర్వామరసామరస్యకల నైకదశన్ ఘటియించు నేఁడు శ్రీ
స్వామికటాక్షముం బడయఁ జాలు నుపాయముఁ దెల్పకుండునే. ౨౧౪.

క. అనవుం డాంగిరసుం డిట్లను నను నాత్మీయ నింత యగ్గించుట యొ
ప్పునె యిది యిట్లగునని సుర ముని వలుకఁడె యతనివ ల్కమోఘము కాదే.

గీ. సాధనీయార్థమున కెందు సాధకుండు, కావలయునంచుఁ గోరుట గలదు గాని
సిద్ధమగునర్థమునకుఁ గాంక్షించు టెందుఁ గలదు సాధకుఁ డొకఁడు గావలయునంచు.

క. శారివ్యపదేశ శ్రీ, శౌరిరితమైనయర్థసందర్భము నే
నారదమునియుం దెలిపెఁ గదా రూఢిగ దాని కన్యథాత్వము గలదే. ౨౧౭.

ఉ. ఇప్పుడె క్షీరవారిధి నహీనశయానుఖగేశయాను బోం
దుప్పటిఁ బూను జానుజిగితోఁ దగు మేను మెఱుంగు రంగు బా
గొప్పగు గొప్పకప్పు మొయిలో యనఁ బొల్పగు శ్రీరమేను నే
చొప్పునఁ జేర కొల్చుటకుఁ జొప్పడు నట్లొనరింపఁ గాఁదగున్. ౨౧౮.

క. అన నందఱు నలమందరమున నుండి పయోధితీరమును జేర గడం
గి నితాంతబు నతాంతం బు నుదాంతం బయినస్వాంతమున వెడలి రొగిన్.

క. మిహిరకులకలశజలనిధి, మిహికాకిరణానమత్స మిహితకరణా
వహబహు సుగుణాభరణా, ముహుగ స్తద్వంశ పురుష పూజిత చరణా. ౨౨౧

ఉ. కుంచితచిత్రకూటగిరికూటరటత్కరటత్రపాటద
ప్రంచలపాత పాటవ స్ఫుటారభటీ త్రుటితారికాటవా
పంచవటీతటీఘటిత పర్ణకుటీనికటాటవీనట
తాంచనకృష్ణసారబల గర్వవిపాటనదివ్యపాటనా. ౨౨౨.

తోటక. స్థిరగౌరవ మానసదృష్టజటా, యురభిఖ్య విహంగధృతోరుజటా
భరకృష్ణమృగాజినవల్కవటా, నిరవద్య కృపాకర నిష్కపటా. ౨౨౩.

## ✽ గ ద్య ము. ✽

ఇది శ్రీమద్రామనామపారాయణపరాయణాతిధన్య కౌండిన్యగోత్రపవిత్ర దేవుల పల్లికులపయఃపయోనిధికళానిధిసీతారామశాస్త్రిపౌత్ర వేంకట కృష్ణ శాస్త్రిపుత్ర తమ్మనాభిధానాంతర వేంకటకృష్ణశాస్త్రినామాగ్ర జన్మ త్రిలింగదేశాగ్రజన్మ సుధీవిధేయ సుబ్బరాయశాస్త్రి నామధేయ ప్రణీతం బైనమహేంద్రవిజయం బను ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీసీతారామార్పణమస్తు.

---

శ్రీరస్తు.

# శ్రీమహేంద్రవిజయము.

## చతుర్థాశ్వాసము.



హనుమత్కృతపదసం
వాహన సౌందర్యరచిత వాచంయమిన
స్మోహన రుచివిజితహరి
ద్వాహన రఘురామ సార్వభౌమలలామా. ౧.

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమౌని, మణుల కిట్లని రోమహర్షణి వచించె
సుచిరపరిలబ్ధపుణ్యవత్యసురుచిరకల, మంజుసంజల్పమాధురీమహితఫణితి. ౨.

మ. కని రాచార్యపురస్సరంబుగ సురల్ గ్రావారితోఁ గూడి యిం
పునఁ జెంపా శరధిం బురారిశరధిం భూదేవిశిం గట్టి వి
ష్ణునిపుట్టంబును శేషశాయి కి లసద్వారాభిరూప్యంబుచే
ఘనమై చొక్కఁగఁ జొక్కమైనశయనాగారం బదూరంబునన్. 3.

మ. కనదుత్తుంగతరంగహస్తముల సైఁగం జేసి యాత్మీయ ని
స్వనసంరంభమునన్ ముకుందుఁ డిదె యస్మన్మధ్యమం దున్నవాఁ
డని యాహ్వాన మొనర్చుచుం బృషతపాద్యం బిచ్చి తన్మాదరిం
చునదీశుం గని కార్యసిద్ధియగు నంచుం జాల సంతుష్టులై. ౪.

కం. గురు ననమయోగవిద్యాగురుఁ గని యుపయోగమై తగురుచిరతరవా
గురుఫణితి నచట నత్రు దజ్జగురుఁ గనుయోగంబును నెఱుఁగ గురుచిన్ వేదన్.

కం. శ్రీకారుణికు సదవనాంగీకారుని నిత్యవిహితకిల్బిషచయభం
దీకారుని హరి నిచ్చట, సాకారునిగాఁ గనంగనగు భక్తులకున్. ౬

ఉ. శ్రీరవరోధినుండి దరిఁ • జేరగజేంద్రుని పట్లఁ దండ్రి ని
ష్కారణ దోషముల్ వలికెఁ • గాన మముం దదపత్యతాదురా
కారులఁ బ్రోవవే యనుచుఁ • గాళ్లఁ బెనంగెడు నక్రపోతముల్
నా రహి మించు నవ్య వజ • నాభుని జంఘులఁ గాంచె నంతటన్. ౧౪.

గీ. ఊర్వశి కరిష్ట మను మాట • యుండెఁ గాన, రంభ కేలయరిష్టమై • క్రాలకుండు.
ననఁగఁ దగు శౌరి యూరుద్వ • యంబునందుఁ, గొంతసేపు వసించె నంగుష్ఠుని చూపు.

కం. పొందువ్వటి శాసె బిగిం, బొందువ్వ తిలంగ నెల్ల • వుడు సజ్జనతా
నందకమై యొప్పెడు నల, నందకమునఁ దనరు కటి గ • నం దగ నంతన్. ౧౬.

గీ. అఖిలమునకుఁ బితామహుఁ • డా విరించి, యిదియ తని కన్న మాతామ • హియగుఁ గానఁ
దన్న కాంచు కయందు బాం • ధవము గలద, టంచు వారినాభి సరసి సేం • వించె గురుఁడు.

సీ. ముగ్ధ లీలావళీ • స్నిగ్ధ వీలావళీ, సరళ సోపానాగ్ర • సరణిఁ బోవఁ
గ్రేవ శ్రీవత్సమన్ • క్రీనీడపై జాడ, హరియురస్సీమ గే • హాజిరమున
శుంభద్భుజోన్నత • స్తంభ సంభృతవైజ, యంతికా గారుత్మ • తా శృంఖ
లా మధ్యభాగ ప్ర • లంబమానానూన, కౌస్తుభమణిదీప • కళికదీప్తి

తే.గీ. యిదిగోఁ గనుఁ డీము నారథా • భ్యుదయరేఖ, యనుచుఁ జూపింపనగ్గురుఁ • డరసి మురిసె
నరసిజాననముఖ వరై • శ్వర్యదాత్రి, భువనజనయిత్రి నందు నం • భోధిపుత్రి. ౧౮.

కం. తిలకించి యకించనుఁ డి, మ్ముల మించిన పెన్నిధానమును గాంచిన య
ట్టుల సంతసించి గీష్పతి, పులకించిన మేనితో సం • ముఖత్సుకుఁ డగుచున్. ౧౯.

కం. తల్లి యోషిల్లోకమ, తల్లి త్వల్లీల చేఁ గం • దా యవ్వాణి
వల్లభముఖులెల్లను నం, వల్లాభోల్లసితులై ప్రం • వర్తిల్లు టొగిన్. ౨౦.

కం. ముక్తాహారులు నవిరళ, ముక్తాహారులును సుహిత • భూరిరసోద్య
ద్భుక్తులు నగుదురు గద త్వ, ద్భక్తులుగా గణుతిఁ గనిన • వారలు తల్లి. ౨౧.

సీ. కడుపేదలై దప్పి • కడుపేద నిల్లిల్లు, దిరుగువాఁడైన నీ • కరుణఁ గాంచి
వలువంతయును లేక • వలవంత దైన్యంబుఁ, జూపువాఁడైన నీ • చూపుఁ గాంచి
నిలువనీడగఁ గాదు • నిలువ నిస్థలియరై, తిరుగువాఁడైన నీ • తెరువుఁ గాంచి
మాటుమానిపికి నేమాటు మానసత్రుఁ జెం, త్రుడుగువాఁడైన నీ • యడుగుఁ గాంచి

యసమశాల్యన్నములయుఁజీనాంబరంబు,లయునముత్సేధసౌధంబులయుఁగుటుంబ
పరిజనంబులయును బెంపుపరిఢవిల్ల, భూరిసామ్రాజ్యుఁడగుఁగదే భువనజనని ?

క. అని యెన్నేనివిధంబుల, ననిమిషగురుఁ డిందిరామహాదేవిని బే
ర్కొని యామెను ప్రసాదంబునఁ దిరమగుసిరి సొనంగు పోఁడిమిఁ జూపన్.

క. మన కిఁక శాశ్వతసంపద, లొనగూడె నటంచు మోదమందుచు మఱియా
ఘనమూర్తి యితరలసదవ, ఘనసందర్శన మొనర్పఁగాఁ గడఁగుటయున్. ౨౪

గీ. పాండురంగా నంతఁ గటినద్ధనందకేత, రాయుధచతుష్కమైన శ్రీహరిభుజాచ
తుష్టయమునందు నిలిచి సంతుష్ట మయ్యె, ననిమిషస్వామిగురువిలోకనచయంబు.

చ. కమలజసూతి ఫాలఫలకంబులఁ బుట్టువుచంద మేక కా
లమున లిఖింప దాసపటలంబున కొక్కటఁ జక్కఁగాఁ బుమ
ర్థముల నొసంగ నాలుగిటిఁ దాల్చెనొకో యన నొప్పు శౌరిహ
స్తములకు మస్తకంబు వినతం బొనరించె గురుండు భక్తితోన్. ౨౬

గీ. కంధరాభిఖ్యభువనవిఖ్యాతి గాంచి, గర్జితస్ఫూర్జితధ్వని గణుతిఁ జేఁ ద
నర్చు వైకుంఠకంఠంబున కువకంఠ, మున సముత్కంఠ గురుఁడు చూపులఁ గదించె.

క. మానసమున గురుఁ డాహరి, యాననరుచి వలువ గన్న యాననరుచిర
శ్రీనలరు దానిఁ గని యస, మానసముల్లాసభాసమానుండయ్యెన్. ౨౮

మ. దివిజామాత్యుఁడు స్వామికార్యఘటనాదీక్షైకదక్షుండు శ్లా
ఘ్యవివేకుండు పదాదిగాఁగ ముఖపర్యంతంబు నత్యంత భ
క్తివిశేషంబున నంబుజోదరునిమూర్తిం గాంచి సాక్షాత్కరిం
చె విరించాదికదుర్లభుం డనుచు నంతఃప్రమోదంబునన్. ౨౯

క. బడి బడి సాష్టాంగముగాఁ, బడి వడి మ్రొక్కులిడి లేచి పలుమడువులఁ బ్రా
మడువుల నడియడిదపుదొర, నడుగక కడుభక్తిఁ బొగడుచుండఁగ హరియున్.

గీ. గీష్పతినిఁ గాంచి నీవు వాక్స్తోష్పతియును, సురలననుఁజూడ నిటకుఁ బుచ్చుట యెఱింగి
ధ్యానగమ్యుండఁ గాన ప్రత్యక్షమైతి, నీకు మాత్రంబె సురపాలనైకలోల.

క. మెచ్చితి నీసచ్చరితకు, వచ్చినపనిముచ్చటించి వర మడుగుము నై
యచ్చరకులదేశిక యన, నచ్చతురుఁడు విన్నవించె హరి కిప్పగిదిన్. ౩౨

గీ. ఏను వాస్తోష్పతియు సుర • లిటుకు నిపుడ, వచ్చుట యెఱింగినట్టి స•ర్వజ్ఞమతికి
దేవరకు విన్నపము సేయఁ•గావలెనె మ,దీయవిజ్ఞాపనం బాది•తేయవరద. ౩౭.

ఉ. శ్రీవర దేవరం గనుట•చేతను జేతనులాజవంజవ
ప్రావరణంబువాసి సత•తైనభవత్పదసేవనంబునం
బావను లౌచు నిత్యవిభ•వంబును గాంచి సమంచితానుమో
దావహులై సదాసుఖితు • లౌదు రటంచు వచింత్రు కోవిదుల్. ౩౮.

గీ. అట్టిదేవరదర్శనం•బైనపిదప, వెట్టివాఁడైనఁ గోరునే • వేఱె వరము
నమృతవారాశిలో నోల•లాడఁ గాంచి, గంజికై యాసపడెడి మూ•ర్ఖుఁ డని కరణి.

క౦. దేవర పాదసూపుట శ్రా,దే వర మన వేఱె యున్న•దే వరపరటా
దేవర థ సంయమీశ్వర, దేవరచితవినుతిపాత్ర•దేవ రమేశా. ౩౯.

క౦. నీ వొనరించినజగములు, భావింపఁగ స్వర్గమర్త్య•పాతాళంబుల్
దేవమనుష్యాసురులకుఁ, దావలములు తత్క్రమంబు• దప్పానె యెపుడున్. ౩౨.

గీ. సంజ్ఞ త్రిదశాలయం బని•స్వర్గమునకుఁ, దనరు బలిసద్మ మనుచుఁ బా•తాళమునకు
నమరు నది యిప్పు డేల వ్య•త్యాస మొందు, సత్యనిర్మాణ నీకటా•క్షంబు గలుగ.

గీ. మాది మాకిచ్చుటయె మడి•మాన్య మిదుట,యనుచుఁ బ్రాకృతుఁగోరిన•యటులమిమ్ముఁ
గోర నేటికి మున్నెయో•వ్వారి కిద్ది, యుచితమగు దాని నటు చేసి•యుంటఁ జేసి.

క౦. బలి శుక్రుని ప్రేరణమున, బలభేదిని స్వర్గపురముఁ• బాయఁగఁ జేయం
బలమఱి మీచరణంబులఁ, గొలువం జనుదెంచె నిటకు • గోవింద హరీ. ౪౦.

సీ. దితితనూభవపండ•హాతులకు దశాకొలం,బకు వీఁపు నగ్గులు•మంచ మయ్యెఁ
బలలాశికుట్టాక•ములకు వేఁడివెలుంగు, కొమరుని తల నంత•కుండ యయ్యె
దైత్యకరాసిశీ•తముల కంబుధినాథు, మే నూరిదరిబొద్దు•మేడి యయ్యె
దనుజాంగుళీ ప్రక్రీ•డనముల కర్థేశు, చెవిదోయి కెన్నెర•చీల లయ్యెఁ

తే.గీ. గొమ్మునేనుంగులే ధావ•న మ్మొనర్ప, నేమి చెప్పఁగవలయును •దోమలగతి
నదినగతిఁగోణపులఁ జేరు•కొనఁగ నేల, చెదరియొక్కొ•క్కమూలవా•రొదిగిరపుడు.

గీ. దీనజనతార్తిసంహారి •దానవారి, శౌరి యనుఖ్యాతి నిల్పుకో •సమయ మిదియె
శిష్టరక్షణ దుష్టసం•శిక్షణములు, నీవు పూనిన పూన్కలు•గావె దేవ. ౪౨.

మ. అనిసాష్టాంగముగా నదిం బ్రణతుఁడై యాదేవదేవాంఘ్రిలం
దనమూర్ధంబున సోఁకుచుక్ శరణుడై తచ్ఛ్రోత్రగర్వాపహా
దనదీక్షాపర ప్రోవవే మము సురేంద్రత్రాణనిర్వాపణా
యనుచుక్ శేవక యున్న కొరి కరుణాయత్తైకచిత్తంబునక్. ౪౩.

గీ. అఖిలసజ్జనలోకాభయప్రదంబు, లైన నాల్గుభుజంబులఁ బతనిఁ బొదివి
లేవఁగా నెత్తి యిట్లను దేవమంత్రి, యీయుపేక్షకుఁ గారణంబెల్ల వినుము.

చ. కులబలసంపదాదులు దంగుల్గానహాత్తినమత్తవృత్తి రయి
ట్టులు దొలఁగుం దదున్నతి కండుం దగుచుండినయంతనట్టుఁ ద
ద్బల ముడిపోయి నవ్వుదు గందా యిది యిట్టి దటంచు నాత్మలం
దలివి వినీతి నీతియు విధేయతయుం సమకూరు నేరికిక్. ౪౫.

కం. బుభువిభుఁ డితఁడు త్రిలోకీ, ప్రభుతా ప్రభవప్రభూతసటు వైభవగ
ర్వభరంబునఁ దక్షత దృప్పి భవాన్ప్రసాద మభిభవించెం దెలుచక్. ౪౬.

చ. ఒరుఁ గని యాదరింపమిరొం రొప్పదు తప్పగు విప్రుఁ జూచి స
త్కరణ మొనర్ప కున్కి కొలంగాదు తపస్వుల నెందుఁ జుల్కఁగా
నరయుట శైవులందు విన యంబె నయింపమికాని మాట వా
విరి మనయత్రినందను మపేక్ష యొనర్చినఁ జెప్ప నేటికిక్. ౪౭.

శా. శర్వాణీకరుణానులబ్ధమనియం సన్మాలికావృత్తము
న్గీర్వాణేశుఁ డొసంగఁజాలఁ దట పోనీ దాని కేమయ్యె నా
సర్వేశాంశమునక్ జనించినమహాశైవుండు దుర్వాసుఁ డీ
దుర్వాసుఁడని మున్నెఱుంగఁడొ ప్రశంసింపం దయ్యె వ్యర్థంబుగాక్. ౪౮.

కం. అవరమువిశాపచ్యుతి, గోవిందుఁడె కలఁ డటంచుఁ గొనకొని సదయుం
డై శాత్రవ్యక యూరక, యే వడలివఁ గ్రమ్మతింపఁ నెవ్వరి తరమా. ౪౯.

కం. ఐశ్వర్యదాత యవ్వర, మీశ్వరుఁ డని మోక్షదాతఁ నేనని శశ్వ
ద్విశ్వప్రఖ్యాతోక్తుల, విశ్వాసంబునను సంభవించును యిరుమల్. ౫౦.

కం. ఏ నన నీశ్వరుఁ డన నిం, తైనను భేదంబు కలదె యదిరొఱుంగక యు
జ్ఞానులుగొందఱు భేదము, గా నెంతురు వారి కెట్టుఁగలుగును సుగతుల్. ౫౧.

ననితాంతాంచదనంతమంటపగతానంతస్ఫటానంతళో
భనశయ్యాంతరశాయి భక్తగణసంపద్దాయి సొక్కుమ్మడిన్. ౧౫.

కం. కని సాష్టాంగప్రణమితులై భక్తిప్రపత్త్యంతనులై గతయా
తనులై సఫలచిరప్రయత్నులై వినుతించిరి విప్రధంబున వరుసన్. ౧౬.

కం. నలువకు నిది యీదృశమని, పలికి నిరూపింప వలనుపడ దద్దిరయో యా
వెలుఁగుంగనుఁగొంటిమియిక, గలుగదుకదదోషఁగుటిర్దుఁగడలుకొనంగన్. ౧౭.

గీ. జలధిపాత్రపయస్స్నానసర్పరాజ, వర్తిఫణమణిదీపాగ్రవర్తికజ్జ
లప్రభునజాండభాండజాలప్రభునినుఁ, గంటిమోహాంధవృత్తిఁబోఁగంటినధిప.

గీ. కృష్ణవర్త్మాహ్వయంబు నాకింతవట్టు, మలినమార్గుండ నగుటచేఁ గలిగెఁ గాని
కృష్ణ నినుఁ గాంచుదాకి నేనిపుడు కనుట, నలరె నిర్దుష్టసాధ్వర్థ సౌముకుంద.

గీ. దితిజగణభయశోగాధమత వహించ్యటను గదా నే గదాధరుండ ననుపేర
నంటినింతకుమును గదాయుధవహింతు, నిఁకగదాయుధధారినామకయశంబు.

కం. అజ "నేతిబీర" వలెఁ బున్యాజనుం డని నాదు పేరు వ్యర్థము సుమ్మీ
ప్రజ లెఱుఁగ నింతదనుక, న్నిజమవిసంవాది యయ్యెనేఁ డది నాకున్. ౧౮.

ఉ. కట్టడిఁ దొట్టి దానవని కాయము కాయమునందు హస్తము
ల్గట్టిగఁ బట్టి పాశములఁ గట్టుటఁ బట్టి జగం బెఱుంగనే
బెట్టుగఁ బాశహస్తసమభిఖ్య వహించితి నిన్నినాళ్లు నా
కట్టి సడి న్మడి న్విడువ నయ్యెఁ గదయ్య ముకుంద యియ్యెడన్. ౧౯.

ఉ. నాదు మహాబలుం డనెడు నామము మిక్కిలి సత్త్వహీనుఁడ
న్వాదు ఘటించె దైత్యబలవర్గబలార్భటి కాఁగ కేడిటం
బేది పలాయనప్రవణవృత్తిభజించుట నింతకాలమో
శ్రీదయితా భవత్కరుణచే నిపు డొందె బలాధికార్థమున్. ౨౦.

చం. దనుజాలి బల్మిఁ గల్మిఁ గొని దర్పమునం బురమాక్రమింపఁగాఁ
గనుకని భీతిఁ బర్వ నలకావిభుఁడం చొరు లింతకాలము
న్ననువ నల కుత్సితప్రభుఁ డనం దగు నర్థముఁ దోఁచుఁ బిల్వనుం
టిని గద యింక నీకరుణచే నలకేశ్వరసంజ్ఞ నొందెదన్. ౨౧.

కం. కరికృత్తివసానతచేఁ, బరఁగితి ముక్తేనుఁ గృత్తివసనుఁడనన్నే
డరిహృతసర్వస్వతచే, ధరియించిన యశ్శ్రీయంతంతప్పెఁగద హారీ. ౭౨.

కం. అని యింద్రాదిదిగీశులు, తన తన పడినట్టి కష్టదశ లిట్లెఱిఁగిం
చి నుతించి రేకముఖముగ, నెనసి పురస్థాయిఫణధరేశ్వరశాయిన్. ౭౩.

దండకము— శ్రీ మన్మహానర్ఘరత్నచ్ఛటోదారకోటీరకోటీరవిజ్యోతిరాటీకనోద్గీర్ణవ
పశ్యద్ఘనధ్వాంత విభ్రాంతికృత్కుంతలాత్యంత కాంతాళికాంతాభిరామాననా
యిందిరామాననాథీన నానాజగద్వల్లభా గల్లభాస్వన్మణీమండలాఖండలాలిత్య
భాకుండలా కుండలీశానతల్పా యురస్థాయితల్పా సదానిర్వికల్పా కనత్కౌస్తు
భాకల్పకా సత్యసంకల్పకా భక్తబృందాలయాళిందకల్పా యనల్పానుకంపా
మతీ భూరిశంపాతతిద్యోతమానాంబుదాడంబర శ్రీసమాలంబిజాంబూనదా
చ్ఛాంబరాంగప్రభా సుప్రభావా శుభావాస వాసంతవేళాప్రఫుల్లప్రసూనప్రతా
నోల్లసన్మల్లికావల్లికాకారరేఖానఖాళీమయూఖా వ్రజాభంగగంగానుషంగాం
ఘ్రిపద్మద్వయా యద్వయా చిద్విలాసా కలాసాదరా ఖేదరాహిత్యకృత్యాతి
పాండిత్యనిత్యాదరా మేదురామోదదామోదరా పాదసేవైకహేవాకభావాకలంక
స్థితిం బొల్చులోకంబులోకంబుహస్తా నిరస్తాఖిలాంహా స్తమస్తోమవృత్తి న్సమస్తప్ర
శస్తప్రకర్షోపపత్తిం బ్రవర్తించి యంచద్వివేకాతిరేకంబులై యంబుజప్రోద్భ
వాదుల్ నిరూపింపఁగా లేనివిజ్ఞానసంపత్తికిం బాత్రభూతంబులై సర్వభూతప్రకృ
ష్టానుభావంబుచే విశ్వభూతప్రభూ! తత్క్షణంబే నమద్రక్షణాక్షీణవైచక్షణీ లక్షి
తాక్షుద్రదాక్షిణ్య మా నీకటాక్షప్రసారంబునుం జెంది యానందమునుం బొందుచు
న్ఘోరదుర్వారనిస్సార సంసారకూపారపారంబునుం జేరి నీదౌ పరత్వస్వరూపంబుఁ
బ్రాపింపఁగా నోపు నో పుండరీకాక్ష యీ యక్షయాజాండభాండంబులం గుక్షి
నిక్షిప్త విక్షిప్తముల్ సేసి రక్షించుదీక్ష న్నిరీక్షించు నీ వేల నీవేల నీవేల నుద్వేల
దుర్విక్రమాభీల విద్విట్కృతోద్వేగయోగార్తి ఘోషించుమమ్మేల రాకుండు
వంచుం గడు న్నమ్మి యుండం గృపాయత్తచిత్తంబునం దత్తఱం బంద నీకుండ
నీవ్యూహలీలాసముత్సాహ మాదివ్యదేహంబు దర్శించు భాగ్యంబు మాకుం బ్రసా
దించితౌ నింతకు న్మున్నుగా నెన్నియో వైభవోదాత్తలీలావతారంబులం బూర్ణ
తిర్యక్స్వరూపంబుగా నర్ధతిర్యక్స్వరూపంబుగాఁ జూపి పాపిష్ఠరక్షఃకృతోప

ప్లవంబు న్నివారించి తీవింక మాయంకిలిం దీర్పఁగా నివ్వు డొక్కింత యేదేని
యుం బిన్నవైయున్ననుం బన్నగాఁ జెన్నగా వర్ణ్నఁ గాన్పించి వర్ణింపఁగా
వర్ణియానట్టిరూపంబుచే నేవు దీపింపఁగా నోపరంధామ యుద్దామసా
మర్థ్యశ్రీముం జూపవే పాపము ల్పాపవే యాపదుద్ధారకా కోపకాపట్య
నిస్తారకా సచ్చిదానందకందా సదాస్పంద గోవింద మమ్మున్ దరిం జేర్చి కాపా
డవే దేవదేవా నమస్తే నమస్తే నమః. ౨౪.

మం. అని యాసర్వనువర్ణ్య లాత్మదళ లాత్మాభీష్టము ల్వీన్నవిం
చిన భక్తాభయదానదక్షుఁ డగులత్ప్రీమ ప్రత్యక్షుఁ డబ్జాక్షుఁ డి
ట్లనియె న్వారలఁ జూచి మీచిరతరాయాసంబు లిం కుండునే
చనుఁడీ మీరలు మీయథాగతముగా నంత్యక్తసంత్రాసులై. ౨౫.

కం. అన విని యాగీష్పతి యి, ట్లనియె న్నీ వానతిచ్చినది వరమే యై
నను సైరింపఁగవలె నొక, మనవి నొనర్చెద మరుత్సమాజశరణ్యా. ౨౬.

కం. దేవరసంకల్పంబ క్రదే విశ్వోత్పత్తిసంస్థితిలయంబులనం
గేవల మఘటనఘటనా, ప్రావీణ్యాత్మ్యవ కొంకింత వనియే యుదియున్. ౨౭.

కం. చనుఁడిక శ్రమముండునె మీ, కనినంతనె వెఱపు దొలఁగు నట వే యన్నం
బనినం దీరునె యాఁకలి, తిని తనియక యున్నచో క్షుధితునకు నెందున్. ౨౮.

ఉ. నేరము నేరు నెంచకుము నేరము నీకడఁ గోర్కెఁ దెల్ప నీ
వారముగాన నిట్లు బహువారము దెల్పఁగఁ జెల్లె మాకు నీ
సారముఁ దొల్లి చూపితి వి సారముఖోత్తమదివ్యమంగళా
కారము లాని యిప్పు డుపకారము నే తను వూని సేసెదో. ౨౯.

కం. ఎప్పటి కెప్పగిదిని మ, మ్మెప్పటి వలెఁ గాదు కొల్పె దెలఁగింపుము మా
యప్పా దార్ఢ్యస్థితిశ్రై, యిప్పాటనభీతమతుల కెటుఁగఁగ వలసెన్. ౩౦.

గీ. ఏను జీవుఁడ ననియు నీ వీశ్వరుండ, వనియు రూఢార్థసంజ్ఞ విఖ్యాత మగుట
వృద్ధటన్వర్ణభూషోప మేయ మగుచు, మనకుఁ దనరారుఁ గాదె సంబంధ మీశ.

చం. అన విని జీవుఁ గాంచి పరమాత్ముఁడు వల్కె దయాత్ముఁడై స్మితా
ననమున సంజ్ఞ రూఢమయిన న్మతి యౌగిక మైన నేమి వ

న్గనుఁ గద వాఁడుంభేద మని • కాని యభేద మటంచుఁ గాని యీ
వ్వనిమతి జీవుఁ డీశ్వరుని • భాస మటంచు దృఢత్వ మొందునో. ౧౨.

గీ. ఏలకామ్యార్థులైనమీ • కిపుడు మోక్ష, సరణి యిట్టిది యని తెల్పఁ • జాలదొక్క
యింతమాత్రంబెయీ తెల్వి • దృఢముగాఁగ, మది గుదురుకొన్న నొకబుధ • మాన్యచరిత

గీ. క్షణికమదమాత్రమున నిట్లు • సంభవించె, నధిగతమధర్ము డైనబు • ధాధిపతి క
నిత్యమదమత్తులకు నెట్లు • నిల్చి యుండు, ననిశముగ స్వర్గభోగము • ల్యసురులకును.

క. అని యింద్రుపంక మొగమై, వనజాక్షుం డాన తిచ్చె • వాంఛాలాభం
బొనగూడును తపమునఁ గా, కనఘుం బది సకలవాంఛి • తార్థము లొసఁగున్.

మ. స్థిరపైనుప్వకళింగమండలమునన్ • దివ్యస్థలం బన్నదా
దరణీయం బఖిలేష్టదాయకము సిద్ధక్షేత్రమై తార్క్ష్యభూ
ధర మష్టాక్షరిమంత్రరాజము సము • ద్యన్నిష్ఠ నచ్చోఁబురం
దరభక్తిన్ జపియించు నాతనికిఁ జే • తం జిక్కు నష్టార్థముల్. ౧౬.

కం. నీవచ్చో మితకాలం, బావిర్భూతప్రపత్తి • నమ్మంత్రజపం
బావర్తించిన మదిలో, భావించినవాంఛితార్థ • ఫలము లభించున్. ౧౭.

గీ. అని యనుజ్ఞ నొసఁగి • యాంగిరసుని గాంచి, వనజనాభుఁ డిట్టు • లనుచు నాన
తిచ్చె నేము నిశ్చ • యించినకర్జంబు, లెల్ల నొకట నిర్వ • హింపవలయు. ౧౮.

సీ. వచ్చినదారిగా • వరుసదైత్యుల నెల్లఁ, బాతాళమును జొరఁ • బనుచు టొకటి
మీమీపదంబుల • మిమ్ము యథాపూర్వ, ముగ సంప్రతిష్ఠించు • పూన్కి యొకటి
నను సుతుఁగనఁదపం • బునుజొనర్చెడునయ్య, దితి కశ్యపులకోర్కె • దీర్చుటొకటి
తార్క్ష్యశైలాఖ్యసిద్ధక్షేత్రమహిమంబు, స్థిరముగా వెల్లడి • చేయు టొకటి.

తే.గీ. యిన్నియును మాదువైదగ్ధ్య • మెఱుకపడఁగ, నొక్కటరచింపనవతార • మొందువార
మేముమీకోరినట్టుల • యిపుడ పిన్న, యనఁగ వర్ణియనంగ మీ • రరుగుఁ డనిన. ౧౯.

ఉ. దేవ మహాప్రసాద మని • ధీరమతిం దగ సాఁగిమ్రొక్కుచో
నావనమాలి కన్మొఱఁగె • నంత సురల్దలి దంద్రులందఱుం
గావర యంచు నయ్యదితి • కశ్యపులం గని తెల్ప గారుడ
గ్రావముఁ జేరి బంధురన • రస్తటసీమ వసించి రందఱున్. ౨౦.

